శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన

# సకలప్రమాణతాత్పర్యమ్



పెరియపెరుమాళ్, శ్రీరంగం




'పండితరత్న'

డా॥ ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అ(మ్మం)గ శింగరాచార్యులు


సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# సకలప్రమాణతాత్పర్యమ్

శ్రీపెరియవాచ్చాన్ పిళ్ళై అనుగ్రహించిన చిన్న చిన్న రహస్య గ్రంథాలు చాలా ఉన్నాయి. వాటిలో, సకల ప్రమాణ తాత్పర్యం అనే ఈ గ్రంథం ఒకటి. ఇది మన సిద్ధాంతస్వరూపాన్ని సంగ్రహంగా అందిస్తున్నది. ఇది ఇపుడు ఆంధ్రీకరింపబడి భాగవత సన్నిధిలో సమర్పింపబడుతున్నది.

***శ్రీమత్కృష్ణ సమాహ్వాయ నమో యామున సూనవే,***

***యత్కటాక్షైక లక్ష్యాణాం సులభః శ్రీధరః సదా***

శ్రియఃపతి, విష్ణు, వాసుదేవ, నారాయణాది పదాలచేత వ్యవహారింపబడే బ్రహ్మం ఒక్కటే ముముక్షువునకు తెలియదగినది —అనేది సకల ప్రమాణ తాత్పర్యం.

ఆ బ్రహ్మం **విశేషణమని, విశేష్యం** అని రెండు విధాలుగా ఉంటుంది.

**విశేషణం** అంటే— విశేష్యాన్ని విడచివుండని ధర్మం,

**విశేష్యం** అంటే —తన విశేషణాలను వీడి ఉండని ధర్మి.

**విశేషణం** కూడా **భోగోపకరణం** అని, **లీలోపకరణం** అని రెండు విధాలుగా ఉంటుంది.

**భోగం** అంటే —ఇష్టమైన ఫలాన్ని అనుభవించడం.

**లీల** అంటే– కాలాంతరంలో ప్రయోజనం ఏమీ లేకుండా తాత్కాలికంగా ఆనందానికి హేతువైన కార్యం.

**భోగోపకరణం** కూడా **చేతనమని అచేతనమని** రెండు విధాలుగా ఉన్నది.

**చేతనం** అంటే– జ్ఞానానికి ఆశ్రయమైన వస్తువు. అచేతనం అనేది జ్ఞానశూన్యమైన వస్తువు.

వాటిలో, చేతనజాతి **నిత్యవర్గమని, ముక్తవర్గమని** రెండు విధాలు.

**నిత్యవర్గం** అంటే –ఏనాడు సంసారాన్ని స్పృశించకుండా, భగవానుని నిత్య కైంకర్యంలో చాలా ఆసక్తిని కలిగి ఉండే అనంత వైనతేయ విష్వక్సేనాది నిత్యసూరి సమూహం.

**ముక్తావర్గం** అంటే– భగవంతుని కృప వల్ల అనాది అయిన అచిత్ సంబంధం నుండి విడుదలను పొంది, నిత్య వర్గంతో కలసి తన్మూలంగా నిత్యంగా భగవత్కైంకర్యపరులై ఉండేవారు.

**అచేతనం** అనేది శుద్ధసత్వాత్మకమై, తనతో సంబంధాన్ని కలిగిన చేతనుల స్వరూప స్వరూపాన్ని ప్రకాశింప చేసేదై, నిత్యమై, స్వయంప్రకాశకమై, కర్మను అపేక్షించకుండా, భగవంతుని సంకల్ప వశంచేత దివ్య విగ్రహాలుగా, దివ్యాభరణాలుగా ఛత్రచామరాది పరిచ్ఛిన్నాలుగా, దివ్యనగరాలుగా, దివ్య జనపదాలుగా పరిణమించి, అంతు లేనిదై, నిత్యులకు, ముక్తులకు, భగవంతునకు కైంకర్య సాధనమై, భోగసాధనమై ఉంటుంది.

ఇక, లీలోపకరణం అనేది **చేతనమని**, **అచేతనమని** రెండు విధాలుగా ఉంటుంది, అందులో, చేతన జాతి కూడా, **సంసారులు** అని, **ముముక్షువులు** అని రెండు విధాలుగా ఉంటుంది.

**సంసారులు** అంటే– అనాది అయిన అచిత్ సంబంధం చేత ఆవరింపబడిన స్వరూప స్వభావాలను కలవార్లై, దానివల్ల అన్యథాన్యాన విపరీతజ్ఞానాలను కలవార్లై, వాటి వల్ల ఏర్పడే రాగద్వేషాదుల కారణంగా కలిగే పుణ్య పాప రూప నానావిధ కర్మలను కలవార్లై, దాని మూలంగా దేవ తిర్యక్ మనుష్య స్థావర రూపంగా నాలుగు విధాలైన పలు శరీరాలలో నిరంతరం ప్రవేశిస్తూ, ఆశరీరాలలో, ఆశరీరంతోను సంబంధం కలవారితోను కలిగే అహంకార మమకారాదుల వల్ల ఏర్పడే దుఃఖాలలో సుఖబుద్ధిని కలిగి ఉంటూ, శబ్దాది విషయ ప్రవణులై, తాపత్రయం చేత దహింపబడేవార్లై, నిరంతరం దుఃఖం అనే సముద్రంలో మునిగినవార్లై ఉండేవారు.

**ముముక్షువులు** కూడా, **ఆత్మ ప్రాప్తికాములు** అని, **భగవత్ ప్రాప్తికాములు** అని రెండు విధాలుగా ఉంటారు.

**ఆత్మ ప్రాప్తిగాములు** అంటే– రాజపదం వరకు కల ఐహికమైన సంపద, బ్రహ్మ పద పర్యంతంగా ఉండే ఆముష్మికమైన ఐశ్వర్యం కూడా అస్థిరమైనది, దుఃఖ మిశ్రం కనుక, ఆ విషయాన్ని విమర్శించి తెలిసికొని, ఆత్మ ప్రకృతి కంటే భిన్నుడై, నిత్యుడై జ్ఞానానంద స్వరూపుడై ఉండడం వల్ల, ఆత్మభోగమే పురుషార్థం అని తలచి, దానిని పొందడం కోసం

ప్రయత్నం చేసేవారు. దానికంటే అధికం అయిన భగవత్ ప్రాప్తి సుఖాన్ని విమర్శించి తెలియనివారు, వీరు.

**భగవత్ ప్రాప్తికాములు** అంటే –ప్రకృతి కంటే భిన్నుడై, నిత్యుడై, నిర్మలుడై, జ్ఞానానందమయుడై, పరిచిన్నమైన జ్ఞానాన్ని గుణంగా కలిగినవాడై, ఆత్మ భగవదనన్యార్హశేషం కనుక, అనన్య భోగ్యుడైన ఆత్మకు, తన అనుభవం, అంటే, ఆత్మానుభవం అణువై, స్వతంత్రం కావడం వల్ల స్వరూప విరుద్ధమైనది అని తలచి, దానిని విషం వలే అనాదరించి, నిత్యమై, నిర్మలమై అపరిచిన్న జ్ఞానానందమయం అయిన స్వరూపాన్ని కలవాడై, సర్వశేషియై, సర్వ శరణుడై, సర్వ ప్రాప్యుడై ఉండే భగవంతుని శ్రీచరణాలలో నిత్య కైంకర్యం పరమ పురుషార్థం అని నిశ్చయించుకొని, ఒక దేశ విశేషంలో, ఒక దేహ విశేషంతో తప్ప అది సిద్ధించదు కనుక, దానిని పొందడంలో విరోధి అయిన ప్రాకృతమైన దేశ సంబంధం, ప్రాకృతమైన దేహ సంబంధం అనే వీటిని విడిచి పెట్టాలి– అని ఆశపడేవారు.

వీరు కూడా, **ఉపాసననిష్ఠులని**, **న్యాసనిష్ఠులని** రెండు విధాలుగా ఉంటారు.

**ఉపాసననిష్ఠులంటే**– ఫల సంగాన్ని విడచిపెట్టి, యజ్ఞ దానాది కర్మలను అనుష్టించగా, విపరీత జ్ఞానానికి కారణం అయిన రజోగుణతమో గుణాలు పూర్తిగా నశించి, యథార్థ జ్ఞాన హేతువు అయిన సత్వం ప్రకాశించి, దానివల్ల భగవంతుని జ్ఞానం కలిగి, అది సాక్షాత్కారంతో సమానమై, అనవరత భావన కలిగి, అది భక్తిగా పరిణమించినదై, సంశ్లేషం

కలిగినప్పుడు సుఖాన్ని, విశేషం కలిగినప్పుడు దుఃఖాన్ని కలిగించేదై, శాస్త్రాలలో మోక్ష సాధనంగా విధింపబడిన భక్తిని ఉపాయంగా అవలంబించినవారు.

ఇక, **న్యాసనిష్ఠులు** అంటే –పూర్వం తెలియజేసిన ఉపాసన కూడా అనేక జన్మలలో సాధ్యం కనుక దుష్కరం అని, దేశ కాల అధికారి రూపంలో అనేక విధాలైన నియమాలు కావాలి కనుక, అపాయంతో కూడుకున్నది అని, ప్రారబ్ధ కర్మ నశించినప్పుడు మాత్రమే ఫలాన్ని ఇస్తుంది కనుక ఆలస్యంతో కూడినది అని, ఆ చేతనం కనుక అసమర్థమని, స్వప్రయత్న సాధ్యం కనుక స్వరూప విరుద్ధం అని, ఈ విధంగా ఇంకా చెప్పబడే అనేక విధాలైన ఆభాసాలైన ఉపాయాలను అన్నిటినీ సాంగంగా, సహవాసనగా విడచిపెట్టి, ఆ ఉపాయాల వలె కాకుండా, నివృత్తి సాధ్యం కనుక ఒక్కసారి మాత్రమే అనుష్టించవలసినది కనుక, సుకరంగా, ఏ నియమం అక్కడ లేదు కనుక నిరపాయంగా, ఈ ప్రకృతదేహం చివరిలో ఫలాన్ని ఇచ్చేది కనుక శీఘ్రప్రదంగా, పరమచేతనం కనుక ఫలాన్ని ఇవ్వడంలో స్వయంగా సమర్థమైనదిగా, నిరుపాదికం కనుక స్వరూపాను రూపం గా ఉండే శ్రియఃపతి శ్రీపాదాలనే విలక్షణోపాయంగా నిశ్చయించుకుని, అందులో తమ రక్షణ భారాన్ని పెట్టినవారుగా ఉండేవారు.

ఈ **న్యాసనిష్ఠులు** కూడా, స్వయంన్యస్తభరులని, పరన్యస్తభరులని రెండు విధాలుగా ఉంటారు.

**స్వయన్యస్తభరులు** అంటే– సదాచార్యుల కృప చేత జ్ఞానాన్ని పొందినవారై, తమ దోషాన్ని అనుసంధించి, హితపరుడైన భగవంతుని శ్రీపాదాలను తామే స్వయంగా ఆశ్రయించటానికి భయపడి, సర్వేశ్వరునకు పత్నియై, వల్లభయై, ఆత్మలన్నిటికీ స్వామినియై, తల్లియై, అతనితో ఎల్లప్పుడూ కలసి ఉండేదైన పిరాట్టి అనుగ్రహం చేత భయంతీరినవారై, వాత్సల్యం మొదలైన అన్ని కల్యాణ గుణాలను కలిగిన శ్రీమన్నారాయణుని శ్రీచరణాలను తమ అనిష్ట నివృత్తికి, ఇష్టప్రాప్తికి ఉపాయంగా ఆశ్రయించేవారు.

**పరన్యస్తభరులు** అంటే –తమకోసం ఆచార్యుని చేత అనుష్ఠింపబడిన ఇటువంటి న్యాసాన్ని కలవారు.

వీరు కూడా, **సనిబంధనన్యస్తభరులు** అని, **నిర్ణిబంధనన్యస్తభరులు** రెండు విధాలుగా ఉంటారు.

**సనిబంధనన్యస్తభరులు** అంటే –తమ అనువర్తనాదులతో మంత్రప్రతుడైన ఆచార్యుని చేత అనుష్ఠింపబడిన భరన్యాసాన్ని కలవారు.

**నిర్నిబంధనన్యస్తభరులు** అంటే– తనకు ప్రాప్తం అయిన పురుషార్థం యొక్క, ఇంతకు ముందు చెప్పిన పై లక్ష్యాన్ని అనుసంధించి, అది వీరికి లేకపోవడమే కాకుండా, వీరు పడే దుర్గతిని చూసి సహించలేని కేవల కృపతో అనుగ్రహించిన ఆచార్యుని చేత అనుష్ఠింపబడిన భరన్యాసాన్ని కలవారు.

వీరిలో, సంసారులు –ఈశ్వరుని శిక్షకు విషయమైనవారు. కేవలురు– ఉపేక్షకు లక్ష్యమైనవారు, ఉపాసకులు– అనుగ్రహానికి విషయమైనవారు. ప్రపన్నులు –కృపకు విషయమైనవారు.

ప్రపన్నులు అందరికీ దేహావసానంలో ఫలమే తగును. వీరిలో ఉత్తరోత్తరం అధికారులు భాగ్యాధికారులు.

వీరు, **ఆర్తాధికారులని, దృప్తాధికారులని** రెండు విధాలుగా ఉంటారు.

**ఆర్తాధికారులు** అంటే– భగవత్ ప్రాప్తి విరోధి అయిన ప్రకృతిశరీరంలోని స్థితి అగ్ని జ్వాలా పంజరంలోని స్థితివలె చాలా సహించలేనిదిగా తోచగా, దానిని నివృత్తి కోసం తహతహలాడేవారు.

**దృప్తాధికారులు** అంటే –భగవంతునికి ప్రాప్తికి విరోది అయిన దేహాంతర సంబంధంలో, స్వర్గ నరకాదుల ప్రవేశంలో విరక్తిని, ప్రీతిని కలిగి, దానిని నివృత్తి కోసం భగవంతుని ఆశ్రయించినా, వర్తమాన శరీరవియోగం కోసం తొందర పడనివారు.

వీరు కూడా, **స్వదహ సంబంధ దృప్తులని**, **స్వదేహి సంబంధ దృకప్తులని** రెండు విధాలుగా ఉంటారు.

**స్వదేహ సంబంధ దృప్తులు** అంటే– శరీరావసానంలో భోగం ఎంత విలక్షణం అయినది అయినా, రుచి వాసన వల్ల దీనిని విడవాలని తొందర పడనివారు.

**స్వదేహి సంబంధ దృప్తులు** అంటే –తనకు భగవంతునకు మధ్య ఉండే నిరుపాధికమైన శరీర శరీరి సంబంధాన్ని అనుసంధించి, అతని కార్యమని తొందర పడకుండా, ఐహిక భోగదాస్యంలో లగ్నమై ఉండేవారు.

**ఆర్తులు** అంటే– భగవత్ ప్రాప్తికి విరోధి అయిన వర్తమాన శరీరంలోని స్థితిని అగ్ని జ్వాలాపంజరంలో స్థితిగా చాలా దుస్సహంగా భావించి, దానిని తొలగించుకోవడం కోసం తొందర పడేవారు.

వీరు కూడా, **ప్రతికూలభోగార్తులు** అని, **అనుకూలభోగార్తులు** అని రెండు విధాలుగా ఉంటారు.

**ప్రతికూలభోగార్తులు** అంటే –ప్రత్యక్ష సిద్ధం అయిన తాపత్రయాదుల వల్ల కలిగే దుఃఖం అతిదుస్సహంగా తోచగా, దానికి హేతువు అయిన దేహసంబందాన్ని, దేశ సంబంధాన్ని, ఆ దేశంలో ఉండేవారితో సహవాసాన్ని సహించలేక, శాస్త్రదృష్టి వల్ల, ఆచార్యుల వచనాల వల్ల తెలియబడేదై, ఆ దుఃఖగంధం లేకుండా, నిరతిశయం అయిన, భగవత్ ప్రాప్తి రూపం అయిన సుఖానికి తొందర పడేవారు.

**అనుకూలభోగార్తులు** అంటే– ఎల్లప్పుడూ చేసే ద్వయానుసంధానంచేత తనకు ప్రాప్తం అయిన పరమపదంలోని నిత్య వాసంయొక్క వైలక్షణ్యం మనసులో స్పష్టంగా ప్రకాశించగా, అది లేకుండా క్షణకాలం కూడా వేయి కల్పాలతో సమానంగా తోచే రీతిలోని ఆర్తిని పొందినవారై, ఆ నిత్యవాసాన్ని పొందడం కోసం తొందర పడేవారు.

ఈ ప్రపంచ విషయంలోని **ఉపాయ కృత్యం ఇష్ట ప్రాప్తి** అని, **అనిష్ట నివృత్తి** అని రెండు విధాలు.

**అనిష్టం**— పూర్వాఘమని, ఉత్తరాఘమని రెండు విధాలుగా ఉంటుంది.

**అఘమంటే** —పుణ్య పాప రూపం అయిన కర్మ. స్వర్గాదులకు సాధనం అయిన పుణ్యం కూడా పాపం వలె ప్రాప్యానికి ప్రతిబంధకం కనుక అఘమనే చెప్పబడింది.

వీటిలో, **పూర్వాఘం** అంటే— భగవంతుని ఆశ్రయించడానికి ముందు అనాది కాలంగా చేయబడిన కర్మ.

ఇది కూడా, **సంచితం** అని, **ప్రారబ్ధం** అని రెండు విధాలుగా ఉంటుంది.

**సంచితం** అంటే— ఫలించడం ప్రారబ్ధం కాకుండా ఉన్న కర్మ. ప్రారబ్ధం అంటే ఫలాన్ని ఇవ్వడం ప్రారంభించిన కర్మ.

**ప్రారబ్ధం** కూడా, వర్తమాన శరీరం ద్వారా ఆరంభమైనది అని, ఇంతకుముందే వేరొక శరీరంతో ఆరంభమైనది అని రెండు విధాలుగా ఉంటుంది.

**ఉత్తరాఘం** అంటే— భగవంతుని ఆశ్రయించిన తరువాత దేహం ముగిసే వరకు వాసన ప్రభావం చేత చేయబడే కర్మ.

ఇది కూడా **జ్ఞాన కృతమని, అజ్ఞాన కృతమని** రెండు విధాలుగా ఉంటుంది. ఇటువంటి భేదాలను కల అనిష్టాన్ని, ఆశ్రయించిన భక్తుని విషయంలో భగవంతునకు ఉండే గొప్ప ప్రీతి చేత ఉపాయభూతుడైన భగవంతుడు పోగొడతాడు.

**ఏ విధంగా? అంటే,**

వర్తమాన శరీరంతో ఆరంభమైన కర్మను నశింపజేసి, పూర్వాఘంలోని పుణ్యాంశాన్ని ఇతని విషయంలో స్నేహం కలవారు అనుభవించేటట్లు చేస్తాడు. పాపాంశాన్ని ఇతని విషయంలో ద్వేషం కలవారు అనుభవించేటట్లు చేస్తాడు. శరీరారబ్ధాన్ని ఈ శరీరంతోనే పోగొడతాడు.

జీవునకు ఎల్లప్పుడూ అనుకూల భోగార్తి ఉంటుంది. ఆ ఆర్తి రూపం అయిన మహా దుఃఖం వల్ల, దానికి హేతువైన అనుభవాహ్లాదరూపం అయిన మహా దుఃఖం వల్ల, శరీరంతో అనుభవించవలసిన దానిని అంతా అప్పుడే పోగొడతాడు.

**ఉత్తరాఘంలోని** అజ్ఞాన కృత్యం అతని వాత్సల్యం చేత మనసుకు విషయం కాకుండా పోతుంది, అంటే, భగవంతుడు మనస్సులోకి లెక్కించడు. పశ్చాత్తాపంతో కూడిన జ్ఞానకృత్యం కూడా అతని క్షమకు విషయం అవుతుంది.

అది భగవద్విషయం అయితే, భగవద్విషయంలోని పశ్చాత్తాపంతో పోతుంది, భాగవత విషయం అయితే, భాగవత విషయంలోని అనుతాపంతో తీరిపోతుంది.

పశ్చాత్తాపం లేని జ్ఞానకృత్యాన్ని, శరీరం చేత అనుభవించవలసిన కర్మవల్లనే, అనుభవించి పోగొట్టుకుంటాడు. సామాన్యమైన నిషిద్ధానష్టానం కూడా భగవంతుని నిగ్రహానికి హేతువు అవుతుంది, కనుక శిష్టజనులు గర్హిస్తారు. అందుచేత అధి క్రూరం. భగవద్విషయం అయినది పశ్చాత్తాపం పొందినది, అయిన కర్మ క్రూరతరం. భాగవత

విషయంలో చేసినది, పశ్చాత్తాపం పొందనిది క్రూరతమం. అందుచేత ప్రపన్నుడు భగవద్భాగవతానుగ్రహం లేకపోతే భగవంతుని క్షమకు విషయం కావడం తగదు కనుక, చాలా జాగరుకతతో ప్రవర్తించాలి. అందుచేత, జ్ఞాన కృత్యం అయిన పశ్చాత్తాపం కలిగే అవకాశం లేనందువల్ల, అనుతాపశూన్యం కూడా దూరంగా పరిహరించబడింది.

అయినా, ఇటువంటి కఠినమైన స్వభావం కలవారు కూడా ఉండవచ్చునేమో! అని శాస్త్రం చెప్పింది. ఈ రీతిలో అన్ని విధాలైన కర్మలు నివర్తించడం సాధ్యమైనందున, ఈ కర్మకృతమైన దేహసంబంధం ఉండదు. దేహ సంబంధం లేదు కనుక, దాని కార్యం అయిన అవిద్య ఉండదు. ఈ విధంగా కర్మ, దేహ సంబంధం, అవిద్య అనే ఈ మూడు లేనందు వల్ల, ఆయా వాసనలు, రుచులు అనేవి ఉండవు. అందుచేత, ప్రపన్నునకు ప్రకృత శరీరం ముగిసేటప్పుడు దేశనియమం, కాలనియమం, అధికారి నియమం, ఉత్తర క్రియలు అనే ఇవన్నీ ఉపాయాలు కావు. అయినప్పటికీ, ఉత్తరక్రియలు కూడా, అంటే, శరణాగతి చేసిన తర్వాత ఆచరించే క్రియలు కూడా, ఆనృశంస్యం వల్ల, అవి భగవంతునకు ప్రీతిని కలిగించేవి కనుక చేయబడతాయి. అంతే.

**ఐహికం** అని, **ఆముష్మికం** అని ఇష్ట ప్రాప్తి కూడా రెండు విధాలుగా ఉంటుంది.

**ఐహికం భగవత్కైంకర్యం** అని, భాగవత కైంకర్యం అని రెండు విధాలు.

**కైంకర్యం** అంటే– ఇష్టాన్ని చేయడం. అది కూడా సామాన్య విహితానుష్టానం భగవంతునకు సంతోషహేతువు కనుక, కైంకర్యం అనదగినది కదా. భగవంతునకు ఏది ఇష్టం అనే విషయాన్ని శాస్త్రం ద్వారా తెలియాలి.

కైంకర్యం **మానసమని**, **వాచికమని** రెండు విధాలు మానసం అంటే మనసును అన్య పరంచేయకుండా, తత్పరం చేయడం.

ఇది కూడా, **చేసిన ఉపకారాన్ని స్మరించడం**, **చేయబోయే ఉపకారాన్ని అపేక్షించడం** అని రెండు విధాలు.

ఇందులో, ఈశ్వరుడు చేసిన ఉపకారం ఏది? అంటే, సదాచార్యుని ఆశ్రయింప చేయడం. అందుకోసం ఆవశ్యకం అయిన అధికారి సంబంధం.

ఇక, **చేయబోయే ఉపకారం** అంటే –పరమపదంలోని నిత్యకైంకర్య ప్రాప్తి, అందుకోసం అయిన అధికారి సంపద. ఆముష్మికం అయిన కైంకర్యం కూడా ఇదే.

ఆ కైంకర్యం కూడా **వాచికం** –అని, **కాయికం** –అని రెండు విధాలుగా ఉంటుంది.

**వాచిక** కైంకర్యం అంటే– స్తోత్రం చేయడం, నామ సంకీర్తనంచేయడం మొదలైనవి.

**కాయికం** కైకర్యం అంటే– సమ్మార్జనం, పూలను కూర్చడం మొదలైనవి.

భాగవత కైంకర్యం కూడా, **ఆచార్యకైకర్యం**, **ఆచార్యులతో సమానం అయిన భాగవతకైంకర్యం** అని రెండు విధాలు.

ఆచార్యులు కూడా **మంత్రప్రదులని**, **మంత్రార్థప్రదులని** రెండు విధాలుగా ఉంటారు. వీరి విషయంలో చేసే గౌరవం కూడా సమానంగా ఉంటుంది. భగవంతుని శ్రీపాదాలు రెండిటిలో తేడా ఉంటే కదా, ఆచార్య విషయంలో వైషమ్యం ఉంటుంది.

ఇటువంటి ఆచార్యులు చేసే ఉపకారం అనేది– అనాదికాలంగా విముఖుడైన జీవుని భగవంతుని విషయంలో ఆభిముఖ్యాన్ని కలవానినిగా చేయడం, మంత్రాన్ని బోధించడం ద్వారా అజ్ఞానాన్ని తొలగించి, జ్ఞానాన్ని కలిగించి, దానికి అనురూపం అయిన కైంకర్యంలో నియమించి, తదీయులలో, అంటే, భాగవతులలో ఒకడు అయ్యేటట్లు చేయడం, అతడు చేసే కైంకర్యాన్ని స్వీకరించడం.

ఇక, భాగవతులు చేసే ఉపకారం ఏమంటే, గుణలేశం కూడా లేకుండా, దోషాలతో పూర్ణుడైన తనను ఆచార్య సంబంధాన్ని చూచి, స్వరూపానికి తగిన కైంకర్యంలో కలుపుకొని, కైంకర్యానికి విషయం చేయడం.

ఇక, లీలోపకరణం అయిన అచేతనం కూడా, **ప్రకృతి** అని, **కాలం** అని రెండు విధాలుగా ఉంటుంది.

**ప్రకృతి** అంటే– సత్త్వం, రజస్సు, తమస్సు అనే గుణాల రూపమై, నిత్యమై, తనతో సంబంధం కల జీవులకు వారి వారి కర్మలను అనుసరించి దేహేంద్రియాల రూపాలలో అనేక రూపాలను కలిగినదై, శబ్దం మొదలైన లౌకిక విషయాలలో ప్రావణ్యాన్ని, భగవంతుని విషయంలో వైముఖ్యాన్ని కలిగించగలిగినదై ఉండే అచిద్విశేషం.

**కాలం** అనేది –నిత్యమై, నిమేషకాష్ఠాది రూపం అయిన పలు వికారాలను కలిగినదై, చేతనుల కర్మకు, దానికి అనుగుణం అయిన భోగానికి హేతువై ఉంటుంది.

ఇక, భగవంతునకు **లీలాపరికరం**, **భోగపరికరం** అయిన చేతనాచేతన వర్గం – తమకు విశేషభూతుడైన బ్రహ్మకు వ్యాప్యమై, ధార్యమై, నియామ్యమై, శరీరమై, శేషమై ఉంటుంది.

ఇక విశేష్యం, అంటే, పరమాత్మ, అఖిలహేయ ప్రత్యనీకమై, కళ్యాణైకతానమై, సదైక రసమై, విభువై, నిత్యమై, జ్ఞానానందాదులను స్వరూపంగా కలిగినదై, జ్ఞానం, శక్తి మొదలైన అనంత కల్యాణ గుణగణాలతో భూషితమై, తనకు విశేషణం అయిన సకల చేతనా చేతనాలకు వ్యాపకమై, ధారకమై, నియామకమై, శరీరియై, విలక్షణమైన విగ్రహాన్ని కలిగినదై, లక్ష్మీ భూనీళా సమేతమై, నిత్య ముక్తానుభావ్యమై, సకల జగత్తు యొక్క సృష్టి స్థితి సంహార కర్తయై, సర్వలోక శరణ్యమై, సకల ఫలాలను ఇచ్చేదై, బ్రహ్మ రుద్రాది దేవతలకు సనక సనందనాది యోగులకు కూడా అవాఙ్మనసగోచరమై, అంటే, వాక్కుకు, మనసుకు కూడా అందనిదై, వేదం వల్ల మాత్రమే తెలియడానికి సాధ్యమై, ఆశ్రితులకు సులభమై, ఆ ఆశ్రితులను ఉజ్జీవింపజేయడమే ప్రయోజనంగా కలిగినదై, పరవ్యూహ విభవ అంతర్యామి అర్చావతారాల రూపాలను కలిగినదై ఉంటుంది.

ఇటువంటి సకల విశేషణ విశిష్టం అయిన బ్రహ్మ ఒక్కటిని మాత్రం తెలిసిన అధికారి వేరొక దానిని తెలియవలసిన ఆవశ్యకత లేని

కృతకృత్యుడు అవుతాడు. ఈ అధికారి జ్ఞానాధికులైన శ్రీ వైష్ణవులకు, నిత్యులకు, ముక్తులకు, ఆచార్యులకు, లక్ష్మికి, శ్రీమన్నారాయణునకు చాలా ఇష్టుడు.